# కృతిపోషకులు
# శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

---

శ్రీ విశ్వనాథ కులమణి !
ఈ వన్నెటు లివ్వ నన్నవే - తమ్ముఁడ, నే
వావిరి హర్షము వన్మ
శ్రీ విభవునిఁ జేయ నిన్నుఁ జేతము పొంగెన్.

అన్న ! నీవొక యుగకర్త వగుట నిజము
నీయుగమ్మున నేను జన్మించు టన్న
ఒక యదృష్టంపు ఫలము చేరికగఁ బడుట
ఓయి, నాయన్న ! యెంత ధన్యుడను నేను.

రస మహస్సుల వెలుగు శీలనము నందు
గణనమును సేయగాఁ జిఱుకబ్బ మొకటి
నీకు నర్పింతు, నెదలోన నింతు ముదము
ఓయి నాయన్న ! యెంత ధన్యుఁడను నేను.

పైడిపాటి సుబ్బరామశాస్త్రి
7—8—59.

# అ భి న ం ద న ము



కవి సమ్రాట్టునకు మహా
కవి సమ్రా ట్టల్లుఁడగుటగాఁ బుర సమ్రా
ట్టు వసిష్ఠుండగుటను గన
సువిశేష వినోదమందు సొంపుం గూర్చున్.

అఱువది యేండ్ల పై వయసునల్లుడు, నన్వది కెంతొతక్కువై
పరగెడు మామగారు, శతపత్రము నిచ్చియుఁ దాను పెద్దగా
నొరయఁ గవీంద్ర పండితుల యుల్లము లల్లనఁ బల్లవింపగా
జఱపుట నయ్యెనిందుఁ గృతి సమ్మద గణ్యము నార్య లొప్పగన్

బ్రహ్మపదాశ్రయంబు విడి, భావి జలేజభ వాశ్రయంబునన్
జిహ్మత లేని రీతిఁ దగి శిష్టులు మెచ్చ మదిం దలంచియున్
బ్రహ్మ కులాభిమండనుని, వాఙ్మయ నాయకు, విశ్వనాథు నీ
బ్రాహ్మికి నీశుఁజల్పి శుభవర్తనఁ గంటివి సుబ్బరామయా.

వి వ ర ణ ము :

పు ర స మ్రా ట్టు : పురపాలక సంఘాధ్యక్షులు, శ్రీ దక్షిణామూర్తి.
బ్రహ్మపదాశ్రయము : విజయవాడలోని బ్రాహ్మణ వీథి.
భావి జలేజభవాశ్రయము : విజయవాడలోని మారుతీనగరము.

శు భ మ్.

ఇట్లు
శ్రేయోభిలాషి,
దోమా వెంకటస్వామి గుప్త
శ తా వ ధా ని.

దివ్యజ్ఞాన సమాజ
భవనము,
7—8—59

# "శతపత్రము"

# రమణీయమైన కావ్యం

—∞∞—

## కృతి స్వీకరణ సందర్భంలో శ్రీ విశ్వనాథ అభిభాషణ

శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారు కృతిగా సమర్పించిన శతపత్రంలో ప్రతిపద్యమూ రమణీయమైనదే, అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు విజయవాడ దివ్యజ్ఞాన సమాజ భవనములో సరస్వతీ సామ్రాజ్యం ఆధ్వర్యమున ఏర్పాటు కాబడిన కృతిసమర్పణ సభలో అన్నారు. ఓరియంటల్ కాలేజి విద్యార్థినులు కుమారి పద్మిని, రంగనాయకి గార్ల ప్రార్థనతో సభ ప్రారంభింపబడినది. కృతికర్త శ్రీ సుబ్బరామ శాస్త్రిగారిని శ్రీ సత్యనారాయణగారు కృతిస్వీకృతి సందర్భంలో ఖద్దరు శాల్వాలతో సత్కరించారు. పురపాలక సంఘాధ్యక్షులు డా. జంధ్యాల దక్షిణామూర్తి గారు సభాధ్యక్షత వహించారు.

శ్రీ సత్యనారాయణగారు ప్రసంగిస్తూ "శ్రీ శాస్త్రిగారు వారి కృతులన్నీ గొప్ప వారికే ఇచ్చారు. ఈ కృతిని వారు నా కీయడం నిజంగా నా గొప్పతనానికి నిదర్శనమే. భగవంతుని నిర్ణయమేదో జీవులకు తెలియదు. కాని, జ్యోతిష్కులు తెలిసికోవాలని ప్రయత్నిస్తారు. నా జీవిత శేషం

విషయంలో అల్లాంటి ప్రయత్నమే జరిగింది. కొందరు మూడేళ్ళనీ, కొందరయిదనీ, కొంద రెనిమిదనీ, మరికొందరు ఇంకా అనీ - ఈ విధమైన భేదాలతో సెలవిస్తున్నారు. నేను ఎంతకాలం జీవించినా నాయందు ఆదర గౌరవాలు కలవారిని మాత్రం మఱచిపోలేను. ఇట్టి ప్రశస్తమైన కావ్యాన్ని కృతి నిచ్చిన శ్రీ శాస్త్రిగారికి నేను సర్వదా కృతజ్ఞుణ్ణి. నాకు ఇచ్చేవారు ధారాళంగా ఇస్తే, నేను శ్రీ శాస్త్రిగారికి వేయినూటపదహార్లు తప్పక ఇచ్చేవాడిని. వారు అంగీకరిస్తే ముద్రణావ్యయాన్ని మాత్రం భరిస్తాను" అన్నారు.

శ్రీ శాస్త్రిగారు సత్యనారాయణగారిని ఖద్దరు శాలువలతో సత్కరించిన పిదప శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తిగారు ప్రసంగిస్తూ తాను సుబ్బరామశాస్త్రి గారిని అష్టావధానాలు శతావధానాలు చేసేనాటినుండి ఎఱుగుదుననీ, ఆలంకారికులు మెచ్చుకోదగిన కావ్యాన్ని రచించడమే కాక కృతిపోషకులుగా శ్రీ విశ్వనాథవారిని వరించడంలో శాస్త్రిగారు ఔచిత్యాన్ని పాటించారనీ, శ్రీ విశ్వనాథవారు కృతి నంగీకరించడంలోనే కావ్యోత్కృష్ట్యం వెల్లడి అవుతోందనీ అన్నారు.

శ్రీ అక్కపెద్ది సత్యనారాయణగారు మాట్లాడుతూ, కృతి సమర్పణ మంటే ఒక జీవుడికీ మఱొక జీవుడికీ ఆంతరమైన సంబంధాన్ని, లోకకల్యాణంకోసం దృఢతరం చేసుకోవడమేననీ, పెద్ద కావ్యానికీ చిన్న కావ్యానికీ పరిమాణంలో తేడా ఉన్నా, రసం పండించే తీరులో తేడా ఉండదనీ, శతపత్రం ఉత్తమశ్రేణికి చెందిన కావ్యమనీ అన్నారు.

శ్రీ దోమా వెంకటస్వామి గుప్తగారు ప్రశంసా పద్యాలను చదివిన పిదప, కుమారి పెనమకూరి శశికళ ప్రసంగిస్తూ తమ ఓరియంటల్ కాలేజిలోని అధ్యాపకులైన శ్రీ సుబ్బరామశాస్త్రిగారి యెడ, శ్రీ విశ్వనాథవారి యెడ భక్తి ప్రపత్తులు వెల్లడించారు.

శ్రీ సుబ్బరామశాస్త్రిగారు శ్రీ విశ్వనాథవారు తమ కన్నగారి వంటివారనీ, యుగకర్తలైన వారికీ గ్రంథాన్ని సమర్పించడంవల్ల తాము ధన్యత చెందామని చెప్పారు. శతపత్రములోని పద్యాలను శ్రావ్యంగా పాడి వినిపించారు.

అధ్యక్షులు ప్రసంగిస్తూ ఇద్దరు కవి సమ్రాట్టుల అపూర్వ సమ్మేళనం గల సభకు అధ్యక్షత వహించే అదృష్టం తమకు గలిగినందుకు గర్విస్తున్నామన్నారు.

సరస్వతీ సామ్రాజ్య పత్రాన శ్రీ అయ్యంకి వెంకట రమణయ్యగారు వక్తలకు సభ్యులకు అభినందనములు సమర్పించారు.

ప్ర జా సే వ

21—8—59

# శ త ప త్ర ము



ఒడలు పసిడిచాయ హొయలెల్ల బయలుగా
సీమచీరకట్టు చిన్నదాని
చేదుకొనుట బదులు చేదుగాఁ జూచెను
వడుకునూలు కట్టువాడు ప్రియుడు.

2

ధవళిమమ్మైన కట్టు దంతముల సొగసు
రంగువేసిన కురుల హొరంగు మెఱపు
కాదు - సరసుండు, బింకమ్ముతోడ చూడ
చాన నవ్వుచు శుష్క కాష్ఠమ్ము విఱచె.

3

నాగకన్యవు - తొయ్యలీ ! నాకు దక్కి-
తీవు - నీ యొంటిపాటు నెంతేని లెస్స !
యనుచుఁ జే యడ్డమిడిన నొయ్యారి నవ్వి
పాప రాజ్యమ్ము నీదిరా, ప్రభువ ! యనియె.

4

కాలుజాఱును, స్నానాలగదిఁ బదిలము!
ప్రక్క చూపులు చూడ కో బావ! నడువు
మనిన మఱదలితో నాత డనియె ముందు
చిమిడె, నీవంట - చూచుకో! చిలిపిపిల్ల.

5

ఆలపించె నతండు 'కామాక్షి' పాడి
యంత వినుచున్న తెఱవ లోలాక్షియయ్యె
మగువ పాడిన 'సింహేంద్రమధ్యమమ్ము'
నాత డానందమున నాట్యమాడి యాడె.

6

చిన్నదానను! ఏమి రాచితివో పసరు
నిన్ను విడలేను - పట్టదు నీకు పిసరు
ఇంటనుండవు - నేడు, రేయెండ కొసరు
నాకు వచ్చెను - ప్రియుడ! ప్రాణమ్ము కెసరు.

7

మంత్ర మెఱుగఁబోవు, మలయాళమునలేవు
నన్ను నేమిచేసి నంగనాచి !
కొంగు ముడిని వైచుకొని నీవు తిరిగెద
వనినఁ బతినిఁజూచి, యామె నవ్వె.

8

సుందరీ ! యంచు పిల్తురు చూచువారు
న్యాయమునుఁ జెప్పు ! నేను సుందరినె ? యన్న
చెలికి, నెదవిప్పి, యామె నెచ్చెలి వచించె;
"పరమ సత్యము—వాట్యసుందరివి ! నీవు"

9

కూడిమాడవచ్చు కోడిగ మ్మిపుడేల ?
కూడివచ్చి పెండ్లినాడు దరిసె—
ననిన నింతి కప్పు డాత డిట్లనియెను
ఎప్పుడైనముద్దు లప్పుడతివ !

10

"మంచి మీసకట్టు మగవాని ధర్మమా
తీసివేసితేమి తెలివి!" యనిన—
నిఱువురందు నౌకరికుంటయే ధర్మమ్మ
టంచు, నతివతోడ ననియె నౌకఁడు.

11

"రాచబాటవచ్చి రవ్వతెత్తు వయారె!
దొడ్డదారి నీకు దొడ్డిదారి
వద్దనమ్ము లింటివానికిన్ జఱుగవు
నీకు జఱిగినట్లు—నిజము! ప్రియుడ".

12

చేరవచ్చువానిఁ జెంప పెట్టుగఁగొట్టి
తోడఁ జూచె, జాలితోడఁ జాన;
చట్టు తగులుచోట, జలయున్నదనుమాట
నిజము; ఆపెయయ్యె—సజలనయన.

## 13

భర్త చూచిన నీయొడల్ పంబరేగు
కొడుకు చూచిన వెంటనే ఒడిత విఱుగు
మిండడౌదువా ! తలసూపఁ, దొంగవోలె !
పోర నీదారి - బ్రదుకరా ! పోరగాడ.

## 14

చిన్ని నాకన్నె వయసు దోసిళ్ళఁ ద్రావి
పుక్కిలింతలుగా, నేడు క్రక్కినావు ;
మనసు మెత్తని దానికి మరణశిక్ష
న్యాయమేకాని-—నీవు, నాయందుకలవు.

## 15

కదలగా రైలు, క్రింది నాగరక రమణి
'ఛీరియో' యంచు ప్రియునికిఁ జేయినెత్తె
ప్రక్కనే యున్న పెనిమిటిన్ బల్లెపడుచు
'ఓలయా ! బద్దిర'మ్మని యొత్తెఁ జేయి.

16

బిగ్గ గట్టిన యుగ్గమ్ము ప్రిదిలె, త్రెస్సె
నెట్టుకొని వచ్చి కంచెలన్, మిట్టలెక్కి
చూచు నావంక నో చెలీ! చూచుకములు
చూచుకొన్నావొ లేదొ! నీ చూపు నీదె!

17

కొండలకుఁ బోల్ప చెల్లదో కువలయాక్షి
మాననీయమ్ము నీ కుచమండలమ్ము!
చలిదినమ్ముల చలియె కొండలను బిట్టు
చలిని నీ మండలమ్ము వెచ్చదన మిచ్చు.

18

"ఎద్దువలె నెదిగె నింక లేదేమి పెండ్లి
చెల్లెలికి," నన్న చెలికి - నెచ్చెలియుఁ బలికె
"తన్ను, పొడుచును, చీల్చును, సున్నమునకు
నెముక లేకుండ - దానితో నిటులె యనుము."

## 19

మగువ! నీ వృత్తి యేమన్న మధుర మనియె
సుదతి! యీ రోగ మేమన్న సుఖమె యనియె
చాన! యిత్తువా! 'రతనంపు సరుకు' అనిన
నున్నవే యిత్తునని పల్కె నులిపి నోట.

## 20

దిద్దినది దిద్దుదువె కాని తెమలబోవు
అతివ! ముస్తాబు రెండవ యాటకేన?
అనిన కాదని నవ్వె - 'పై యాట' కయినఁ
జాన నేనును 'సై' యనె - సకియ యోర్తు.

## 21

ఉవిద తీయగపల్కె నుద్యోగ సరణి
మెలతతో నంత తీయగా మెలగె నొకఁడు
ఆమె కారాలు మిరియాల నంతనూరి
భోరనిన నంత నతడు కన్నీరు కార్చె.

22

పాముకూత గడ్డి వాముల దొడ్డిలో
వినగ వచ్చెననుచు వెడలినావు;
వచ్చె నంతనంత పారావతధ్వని
తరుణి! సిగను గడ్డి పఱక లేమె!

23

బుగ్గ చిటిక నుత్త పున్నాని కనివేయ
గుబ్బ పట్టినావు కుఱ్ఱవాడ!
తల్లక్రిందు లయ్యె ధర్మమ్ములవి నేడు
వదలనింక నిన్ను, కదలి చూడు.

24

పట్టి చూచిన బంగినపల్లి జాతి
కొమ్మ! యెంతటి తీరు తీయమ్మ నీది
కండలను కోసి యిచ్చు త్యాగమ్ముఁ గలుగు
మధురమూర్తివి! నీకు సన్మానమస్తు.

25

పాట వినుచుండ మూతలువడెను కనులు
తెఱచినను మూసినను నొక్కతీరె నీవు
కోకిలమ్మవు; ఇదియు నిక్కమ్మవ మటన్న
చాన నయనమ్ములయ్యె కషాయితములు.

26

అతడు మూసిన తెఱచిన యంతకనులు
నామె వాల్చియు తేల్చియు నతనిఁజూచె
ఇఱువురనుఁజూచి చెఱకు విల్లెత్తె మరుడు
రద్దియైనట్టి 'సినిమా' విరామ వేళ.

27

ఆమె యిఱుగమ్మ: మాట సహాయ పడితి
వచ్చితివి పెండ్లమా! 'వాలవాల' యనుచు
పెదవి మెదపుటె యంత తప్పిదమయైన
నింట నిఁకనుండనో 'హిడింబీ!' నమోస్తు.

28

సిగ్గు విడచి నేను మొగ్గిన నాయంత
సిగ్గు పడెద వేల, చిన్న వాడ!
వచ్చినపుడె చేత పట్టగావలె సిరి
చేయి వదలినావొ, సిరియు జాఱు.

29

రాగమును పాడ నా కనురాగ మొదవు
తానమును పాడ సుకములో తానమగును
పల్లవినిఁబాడ నుల్లమే పల్లవించు
నేమి పాడెద వోసి! నా హృదయవీణ.

30

తొలకరించిన వయసునఁ బులకరించి
గిలకరించిన నీనవ్వు లోలికి పోవు;
ఎత్తుకొందును నేను మేనత్త కొడుక
'నెత్తుకెత్తుగ బంగారమే' లతాంగి.

31

ఎక్కుఁబెట్టుట తిగుచుట యేయుటెంతొ
సమయహార మంచు నా పుష్పసాయకుండు
పాశ వినియోగ సౌలభ్య బద్ధ దృష్టి
నీదు కేశమ్మె వరియించె నీలవేణి.

32

తారు, మసిబొగ్గు, కెనయైన తరుణి నొకఁడుఁ
బలుకరించిన ; ధనువునుఁ బట్టె మరుడు;
ఆమె యికిలించె సకిలించె - నంతఁ బ్రియుడె
కుప్పకూలగ, మరునికిఁ గోల విఱిగె.

33

పీమ సున్నంపు కణిక, నీ చేయిఁ జూచి
జాఱినది గుండె, యో తెల్ల చాన ! యనిన
భ్రష్టుడా ! రమ్ము, నా ప్రేమ పాత్రమైన
శిలువ, యాశ్రయమిడునని చెలియ పలికె.

34

గృహమె స్వర్గమ్ము - ఇందె వసింపుమయ్య
నడువఁ బనిలేదు జంభారి నగరమునకు
పండ ముగ్గిన దిదిగో ! రంభా ఫలమ్ము
సోమ రసపీధి ! మన్మనః ప్రేమపరిధి.

35

ఓసి సింగారి చెల్లెలా ! ఓసి పడుచ !
బావ యెంతటి తీయనివారు కాని
ముందుగా, నీవె పుట్టకపోతివటవె !
నేనె వెనుకైన, క్రొత్తయే లేనె లేదు.

36

అందకాడు రసికు డైశ్వర్యవంతుండు
వరుస మగలు మిత్తివాతఁ బడిరి ;
వారిఁజూచి యీర్ష్యపడిన విధాత నీ
కాయువిచ్చె నాథ ! యంతె చాలు.

37

మొదటినుండి తుదకు ముమ్మారు భారత
శ్రవణమైన యొక్క చాన, పలికె
"ఓసి చెలియ ! యెంతయోధన్య, ద్రోవది
పతుల నైదుగురను పడతి పొందె"

38

మండుటెండ కొండదండ నొక్కటి రండ
ముచ్చటాడి పోసె ముంతచల్ల;
ఏల యింద్రపదవి ! యీ చలివేంద్రమే
స్వర్గ - మమృతమనియె చల్ల నతడు.

39

పోతు తాడికల్లు ముంతల నెగఁబోసి
వచ్చినావు మామ ! చచ్చిపోదు
వనిన నతడు నవ్వి "ఛా-లేతముంజియా !
రేపువఱకు నిదుర లేప వలదు."

40

పండువంటివాని వయసు పండినవాని
మిండడంచు నొక్క మెలత పలికె;
అనుభవమ్ము నతడు నందయు దండయొ
నామె యతని కగుట యప్పుడపుడు.

41

మిట్టిపడెదు ! కన్ను కుట్టెనా ? మగవాడ
పట్టరాకు మోయి ! పైట చెఱగు
నీదు కన్ను చలువనే చూచుకొందువు
కాని, నీకు నాకు-కన్ను ! పాప.

42

కడుపుచల్లగ, నేడాది గడిపితీవు
మంచిదాయెను ! పోసితి మంచిచల్ల ;
ననిన నతనికి నవ్వి, యొయ్యారి పడుచు
సూడిదయునైన కడుపునుం జూచుకొనెను.

## 43

చిగురు కెగఁబ్రాకెదవె! యెంత పొగరు నీకు
చింత చెట్టెక్కి కూసెడి చిన్నదాన!
పడిన నామీద, నొడలు నప్పచ్చి యగును
కాని యొడిని చిగురు, కనికరముఁ జూపు.

## 44

ఆమె పూలమ్మ, మఱియు కాయలును నమ్మ
'కాయకును కాయ' కామె తగ్గనిది లాభ
మగుట; ఫలముల, మఱియు, నేమైన నమ్మ;
రమణి 'తరహా'యె వేరు, బేరమ్మనందు.

## 45

మధురయందెకాదు, మఱి వీడువీడునన్
కలరు చూడ గోపికలు నిజమ్ము -
వేణువున్నచోటె బృందావనమ్మగు;
రసము కలుగు లీల రాసలీల.

46

రెండు పావురమ్ములుండి గుండెకు నీకు
శాంతిలేదు, నాకు శాంతిలేదు-
శాంతికొఱకు, నెగురసాగెను పావురాల్ ;
దేశరీతి, నన్ను-తెలుప ! కనుము.

47

రెపరెపలనాడు నీదు వల్లియను చూడు
తేలిపోయెను నావైపు గాలిసోకి
పైదలీ ! యన్న, తోడనే పట్టుకొనియె
డిల్లపడి, వల్లెకాక, గుండియనె బేల.

48

మెత్తనిది, క్రొత్తనిది, నీదు మేనువిడచి
నిట్టనిలచెమ రైక, నీ గుట్టు తెలిపె
గుబ్బెతా ! యన్న యతని సిగ్గున నదల్చె
'చిట్టకము లింక చాలని చిగురుబోడి.

49

చిలిపిచూపుల, కోపుల, చెలియ ! వీడు
వలలఁ బన్నుచు, నా వచ్చుపథము నిలచు ;
చిట్టుమనకయె, యూరక హసింతునంతె-
ఇకను నా దాసవిడక, తీసికొని చచ్చు.

50

చెలువముంగని, నేస మూర్ఛిల్లవలె న
టించు, నితగాడు, మఱియూహఁ, బెంచుగాని
ఎంచ దోకనాడు, తనదైన చుంచుమూతిఁ
గనిన లేమలు, మూర్ఛలో మునుగుచురని.

51

కామినీ ! నమ్ము శృంగార ఘట్టములను
వల్లెవేసితి, నింతె పాపమ్ము నాది -
పిలచి, నా చెంప 'చెళ్లు' మన్పించినావు
అర్భకుండను-కాను, నేనంతవాడ !

52

అంబరమ్మంటు కట్నంపుటాసఁ జేసి
వీటఁబుచ్చితి మన చిన్ననాటి ప్రేమ ;
అంబరమ్మంట రాకు-మేనత్తకొడుక !
సంబరము చాలు ! మాయింటి చాయరాకు.

53

రమ్మనుచు నన్ను తాళవృంతమ్ము విసరి
విసరికొట్టెద వేలనే ? కుసుమగాత్రి ;
మగువ ! విసరితి, నాదు కామానలమ్ము
నంతియేకాదు, బిట్టు క్రోధానలమ్ము.

54

తెరువుఁ జూపింపుమనిన నీ తెఱగదేల
తెఱవ ! వింతగు, కన్నుల బరువదేల
బరువు మోసినయట్లు సంభ్రమ మదేల
దారి చూపింపవే యుపకారబుద్ధి.

55

కఱవు చూపులనిల్పి చిత్తరువువోలె
విత్తరీ! ఏల నన్ను స్తంభింపఁజేయ
దారి దొంకయు తెలియనితనమె కాక
పత్తనమ్మనకేమొ, నేఁ గ్రొత్తవాడ.

56

తూగిపాడగ కదన కుతూహలమ్ము
ఇట్టిపొంగితి వమృత వాహినిని పాడి
రాగములు వేరెయైనను రక్తియొకటె
రసము లొలికించు పట్టున బిసరుహాక్షి.

57

పలుకరించుము నీ తళత్తళలు నన్ను
వెన్నెలలోన వన్నెల విసనకఱ్ఱ!
బిఱ్ఱువిడవేని యడవిలో వెన్నెలగును
పరువమైనట్టి నాదు' జవ్వనము బేల.

58

ఎన్నడునుఁగాని యిట్టిపాటెఱుఁగ నెఱుఁగ
కదలనీయవు చూపులఁ గట్టి కట్టి
కట్టుపడుటనుకూడ సుఖమ్మె కనుట
భామ ! వాంఛింతు నిత్యమ్మె బంధనమ్మె.

59

'తాన' యన నీవు, నేను 'తందాన' యందు
కొమ్మ ! నీవాడఁ దాళమ్ము సుమ్మునాది
పాలనో లేక నీట - నీ పాలబడిన
నన్ను ముంచంగఁదగు, లేటికన్నుదాన !

60

చేడె ! వేటాడె దే మగజీవినైన
కనుబొమలతోడ సగముచూపునె లగించి
దండనుండిన నీవు వేదండయాన !
భావజుని మార్గమే సులభమ్ముసుమ్ము.

61

ముసరు ప్రణయమ్ముఁ జెలియ నీమోముపైన
దాచుకొనెదవు నాయెద - దోచుకొనియుఁ
ముసురుఁబట్టెను, ధనువును మొనసిపట్టె
కంతు డిక అంతులా ? మొనకసురు మాను.

62

జాడుజాడుగకొట్టె నీ జాడ కనుమ
తియ్యవిలుకాడు బాణమ్ముఁ దిగిచిపట్టి
దుయ్యబట్టెద నతని నుద్ధరత మెఱసి
నెయ్యపుం గిన్క మానవే ! నీవు చెలియ.

63

మించు బోడిరొ ! గ్రుడ్లప్పగించి చూతు
నావయిపు ప్రొద్దుతిరుగుడుఁ బూవువోలె
యాశపడితిని నిన్నుఁ గన్నంత నేను
అంతలో నేల యగుదువే యత్తిపత్తి.

## 64

రవ రవలు నీకు నాకు తోరమ్ములైన
వెట్టివై, ప్రేయసీ! గంగవెఱ్ఱు లెత్తి
చెప్పికొందువు మత్తిరస్కృతకు నీవు
ఆమె యౌదార్య్ర నీకు సత్యమటె! బేల.

## 65

చరణచరణమ్ము నందున విరతి కలదు
ఆంధ్రమున వ్రాయబడెడి పద్యమ్మునందు
చరణములఁగాదు మఱియు హస్తములఁగూఁ
ప్రేమ పథమున మనకేది విరతి చెలువ.

## 66

తాయిలము పాలకొల్లు బత్తాయి యన్న
నిజము నిజమోయి యీ తెల్గు నేలయందు;
రమణి యురమున కలదు ఫలద్వయమ్ము
వస్త్రముం గప్పి నిచ్చలు భద్రపఱచు.

67

తాళిఁ గట్టిన మగని మెత్తఁదన మేమె
యెంత రేయైన బస్తీకి నేగనిచ్చుఁ
జీర నలిగిన, నతఁడు ప్రశ్నింపబోడు
వచ్చి నప్పుడె రానిచ్చుఁ బల్లెపడుచ!

68

వచ్చుచున్నది పునుగు జవ్వాది తావి
తెచ్చు చున్నది మధుర సందేశమన్న
వయసుకానికి, బొమముడి వైచి పలికె
సోక లేదంచు తన గాలి, సోకులాడి.

69

దేశ హితమగు, కళలు వర్ధిల్లు, నామె
కన్నెగా నున్న, పెండ్లి శృంఖలములేల?
దరువు పట్టిన చాలు నా తరుణి మిన్న
యుల్లము రసించు, ఘల్లున తెల్లవాఱు.

70

పోకలను మాత్రఁ జూచితి, కోకలేల ?
పోక ముడివేయలేని యీ పోకడేల !
మంచి మనసాయె నీకు మన్మధుని మొలక!
చిఱుతుకవె యైనఁ బెండిలి సేయవచ్చు.

71

అసలు పాలమ్మువారు కాయకమువారు
కాని నీవు 'నికారసు', కాని నీకు
పట్టుమని యీయనొక నయాపైసఁ గాని
చిన్ని పడుచా ! యటన్న 'అసెల్లె' యనియె.

72

బిత్తరీ ! యెంత యుక్కిరిబిక్కిరైతి
పీట ముడివడి కంచెల బిఱ్ఱు బిగిసె ;
కాని యాలోప మొక్కచోఁ గలిసివచ్చె
సన్న సన్నగ జరా జరా జాఱె నీవి.

73

రమ్మనుచు నీవు కురియు వరాల వాన
తడియనొల్లను నన్నహో విడిచిపెట్టు
పెట్టవేనియు నే నురివెట్టు కొందు
మూర్ఖనను నిన్ను—ముంగిస మూతిదాన!

74

ఇంతి! నీ పెండ్లి యగునంత "నెగురు"దణఁగు
ననుచుఁ బలుమాఱు చెలికత్తె లనిరి కాని
మానినికి నయ్యెభర్తవై మానికుండు
ఎగిరె నామెయు నతనితో గగనవీధి.

75

దొప్పలం దెచ్చియిచ్చిన యిప్పకల్లుఁ
ద్రాగుచుండెను, మఱియునుఁ ద్రాగుచుండె
నడవి దొరసాని బయలైన యట్టి సొగసుఁ
ద్రాగుటలు హెచ్చుకొలది యా నాగరకుడు.

76

అప్పుడే కుట్టుపనిదాని కాది యిచ్చి
కోరి కుట్టించు కొన్నట్టి క్రొత్తరైక
నిదిగొ చెల్లెల! నీవె ధరింపు మనుచు
బైనఁ బడవైచె, సిగ్గరి వయసుకత్తె.

77

నందనమ్మలు పూయు విన్నాణమైన
సిగల, నగవులె వారికి నగలు, మఱియు
సొగసుల కొటారు లెంతకుఁ దగినవారు
చానలున్నది యొక్క పసందు సందు

78

ఆ కళాశాల శ్రద్ధాళువగును లేమ
కాని చెప్పినదంటిన కళయె లేదు;
చెప్పకయె యంటె నందు వైచిత్ర్యమేమొ
తరుణి కోకవిద్య; యామె శ్రద్ధాళువయ్యె.

శ్రద్ధాళువు : వేవిళ్ళకలది

79

కొమ్మ పలికెను-శ్రవణయంత్రమ్ము నెత్త-
పిలచినట్లుగ "నంబరు ప్లీజ"టంచు;
గుటకలను మ్రింగి యతడు వాక్కును కుదించు
నువిద, రెట్టించు రెట్టించు; నాలికి మధువు.

80

"మల్లియలె ముందొ, కాయ మామిళ్లె ముందొ!
ఆమనిని" యన్నపతి, నెదహత్తుకొనుచు
గుబ్బెతయు నవ్వె-బదులుగా, కోమలముగ,
తలను చెరివిన మల్లియ తావి కొసర.

81

అలిగి, పుట్టిల్లుఁ బట్టిన పొలతి సంజ
మల్లె జడవేసి 'మఱదలు - పిల్ల'ఁజూచి
చిఱుమొగిలు రేక యెడద సంబరముఁదోచి
"అమ్మ! నీ యన్న మంచివా ర"నియె, నాచి.

82

ముసలి పనికత్తె పనిఁజేయ మూల్గుననుచు
వయసు పిల్లనుఁ గుదిరిచెఁ బడుచు మగఁడు;
ఇంటి యాబిడ పొదుపు వల్లించి మించి
యంట్లు తోమెను తనకుఁ దానౌచునంత.

83

ఎదురు గాలి, నీకు నెదురు వచ్చితి నేను
పైటచెదరె, నొంటిపాటు నమరె;
ఎఱ్ఱబడెను కనులు నిసుకతో - నూదెద,
వాలుఁ దిరుగుమన్న వాలె భామ.

84

"నిప్పువంటిదాన, నిజ మెఱుంగవు నీవు
తప్పుకోవు దారి; తప్పు మనిసి"
యన్న నతడుఁబలికె "నతివ! క్రమ్మెను పొగల్
నిన్ను తాకినంత నీరమైతి".

85

నాకె తెలియని తొలి జవ్వనమ్ము నాడె
నాకమే యిచ్చినావు ప్రాణప్రియుండ!
ఎన్ని నాళ్ళాయె! నీవె లెక్కింపు సఖుడ
నా డుగాదియె, మఱియును నే డుగాది.

86

కమ్మ విలుతుడు తూటాడ కొమ్మ వ్రాసె
కమ్మ నొకదాని, ప్రియుడు నిక్కమ్ము వచ్చె;
కమ్మవా తెఱ నీదు శృంగారలతిక
అతడు వచ్చుట తడవైనయంత, ఁగినిసి.

87

సారె సారెకు చూపుల వారబోయ
వారబోసితి నాదు జవ్వనమె నీకు;
మించు బోడిరో! విశ్వాసముంచవైతి
నేరమగు నిన్ను నమ్మ, తుటారికత్తె!

88

గట్టిగా తోడుపెట్టిన గడ్డపెరుఁగు
తీసుకొనివచ్చు బొట్టెనుఁ దిట్టి మగడు
వట్టి జావైన యా పాడుపడుచు పెరుఁగు
వాడుకనుఁ బెట్టినాడని వగచె భార్య.

89

కాంత యేకాంత మందున గానవిద్య
నేర్వగాఁ గోరు పురుషుని నికటమందు
విడచివచ్చెను తానయి వీణమోసి
పడతి మగడన్న నెంత ముందడుగు వాడొ.

90

"వట్టి యాడంగిరేకుల వాడెమగడు
ఎటుల చేసితి కాపుర మిన్నినాళ్లు"
అనిన "సరిసరి, యంతటి యతడువాడు
కాకయేయున్న నెటుల నా కాపురమ్ము."

91

కటకటా! నీవువిసరి తెక్కలను వేసి
మానినీ! నన్నుఁ జూచుట మానినావు
కాని, కిటికీకి వెనుక నీ గాయపడిన
మనము, నను గాయపఱచుట మానలేదు.

92

ఓసి లంబ స్తనీ ! ఓసి ఓసి పడుచ
నిన్నమొన్నటి చిన్నారి కన్నెవీవు
సొంపు చెడితివి నిన్ను వీక్షింపలేనె
'తార'వై బొమ్మ లోని సుతారమెఱిగి.

93

తమ్మిడీరేయి రాడిక తప్పెవేళ
తప్పదిక నాకు రమ్మని తెప్పలోనె
పిఱుదులంటిన తన యాడుబిడ్డఁజూచి
సకియ ముస్తాబులోనె లజ్జపడె సగము.

94

పండుదబ్బచాయ బండివాడా ! బండి
నెక్కనీయవోయి యొక్కమాఱు
పున్నెముండుఁ దప్పిపోతి నొంటిగ నిసి
ననిన పడుచు నతడుఁ గనికరించె.

95

పేరుపేరున నక్కఱ పెండ్లికొడుకు
వందనమ్మిడు పెద్దల వరుసలోనఁ
గ్రొత్తగాఁ గాపురమ్మైన యత్తసవతి
యాదరమ్మున దీర్ఘాయువని హసించె.

96

ఎంతొ సిగ్గుచేత నే గిలిగింతలై
చెంతలేకయున్న చింతఁ దీర్చి
యల్లు నాదరించి యాతిథ్య మిచ్చితి
వమ్మ ! కడుపునిండె నంతెచాలు.

97

పొలము దున్నుటెకాదు కేవలము వాడు
లేమ మగవాఁడు గ్రామమున్ లేనియపుడు
నరమరిక లేక యింటి కృత్యములఁ దీర్చు
పాలివాఁడన్న తొలగఁ జెప్పవలె నతని.

98

చిన్ని గొడుగున్న వయసునఁ జిన్నకాని
'మిస్సో'కర్తృక యొక 'సిటీబస్సు'నందు
జంటసీటున మొలక మీసాలవాని
గ్రుమ్మె నుసునుస్సు రంచునుఁ గొసరికొసరి.

99

చాన! పుయిల్లోడి కేశ సంస్కారమునకు
కత్తిరించితి మెడ నంటగాగ నీవు
అదియు సంస్కారమునుఁ గోరదా మఱింత
దుంగవదలియు మొద్దు నెత్తుకొనుటేల?

100

కోమలీ! నీకు నే గోలకొండకోట
చాన! నాయెద హుస్సేను సాగరమ్ము
ప్రేమకురిసితివా గండిపేట చెఱువు
జంటనగరాల ముచ్చటౌజంట మనది.



న్యాయ శిరోమణి

# శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులవారి

## ఆంధ్రధ్వన్యాలోకము నుండి



అప్రస్తుత ప్రశంసయందు వాచ్యమొక్కపుడు వివక్షితముగను మఱియొకప్పు డవివక్షితముగను, నింకొకప్పుడు వివక్షితా వివక్షితముగను గూడ నుండును.

వివక్షితా వివక్షితమున కుదాహరణము :

తమ్ము డీ రేయి రాడిక తప్పె వేళ
తప్పదిక నాకు రమ్మని తెప్పలోనె
పిఱుదులంటిన తన యాడుబిడ్డఁ జూచి
సకియ ముస్తాబులోనె లజ్జపడె సగము.

(శతపత్రము-93)

ఈ పదార్థము అసలే సంభవింపనిదియుగాదు. సర్వత్ర సంభవించునదియు గాదు.

(మగనికై ముస్తాబొనర్చుకొనిన మరదలను 'ఆడుబిడ్డ సగము మగడను' సామెతనుబట్టి యట్లుపహసింపగా మిగిలిన సగము స్త్రీయే కనుక 'ఈ ముస్తాబు అనుభవ యోగ్యము కాని యాడుదాని కొఱకా' యనియు 'ఆడుదానికి మాత్రమే వ్యామోహము కల్గించెనే' యనియు మరదలు సగము సిగ్గు నొందెనని భావము.)

## గుణీభూత వ్యంగ్యము :

గుణీభూత వ్యంగ్యమను కావ్యప్రకారము కూడ రసాది వ్యంజన ననుసరించి ధ్వనికావ్యమున కంగమేయగును.

ఎంతొ సిగ్గుచేత నే గిలిగింతలై
చెంతలేకయున్న చింతదీర్చి
అల్లు నాదరించి యాతిథ్య మిచ్చితి
వమ్మ ! కడుపునిండె నంతె చాలు. (శతపత్రము-96)

ఇట "ఆతిథ్య మిచ్చితి వమ్మ" అనుచోట నసూయా విషాద మాత్సర్యముల వలన నేర్పడిన స్వర వికారరూపమగు సోప హాస గద్గదకాకువు 'ఆతిథ్యము' అను పదార్థగత విశేషాను సంధాన సహితమై తన తల్లికి తన మగనితోడి యవినయ సంబంధమును వ్యక్తీకరించి 'కడుపునిండె' అనుచోటి యర్థ మునకు వ్యతిరేక వైచిత్ర్యమును సంపాదించును. అనగా 'కడుపు మండె'నని వ్యంగ్య మొసర్చి వాచ్యార్థమును చమ త్కరించును.

పేరుపేరున నక్కఱ పెండ్లికొడుకు
వందనమ్మిడు పెద్దల వరుసలోనఁ
గ్రొత్తగా కాపురమ్మైన యత్త సవతి
యాదరమ్మున దీర్ఘాయు వని హసించె.

( శతపత్రము-95 )

ఇచట తన సవతి యల్లుని యాదరమున నాశీర్వదించు 'నత్త సవతి' హాసనమువలన నీ క్రొత్తల్లునితో చౌర్యరతము నభిల షించిన దీమె, యని వ్యంగ్యమై తెలుగుదేశములోని యొక

పల్లెటెడిక్కు సామెతను స్ఫురింపజేయు దీర్ఘాయుపదము తోడ్పాటుతో హసించు పదము నర్థము నుపపాదించి యుపస్కరించును.

ప్రకృతమగు నీ ధ్వనికి స్వప్రభేదములగు వివక్షిత వాచ్యములును, అవివక్షిత వాచ్యములును, గుణీభూత వ్యంగ్యమును, వాచ్యాలంకారములును, వీనితో సాంకర్యము కొన్నియెడలను, సంసృష్టి కొన్నియెడలను, నేర్పాటొనర్చ నచో ననేక విధములగును. (7420 కు పైగా) స్వప్రభేద సంకీర్ణధ్వని, స్వప్రభేద సంసృష్ట ధ్వని, గుణీభూత వ్యంగ్య సంకీర్ణము, తత్సంసృష్టము, సంకీర్ణాలంకార సంకీర్ణము, సంకీర్ణాలంకార సంసృష్టము, ఇంక నెన్నియో చెప్పజాలనన్ని భేదము లీ ధ్వనియం దేర్పడును. ఇందు ధ్వనికి స్వప్రభేద సాంకర్య మనేక రీతుల నేర్పడును ... మఱియొకచోట ధ్వని ప్రభేదములు రెండొక యెడచేరుట సందేహసంకరము. ఏక పక్షము నే నిర్ణయించు ప్రమాణమేమియు లేనిచోట సందేహ సంకరము.

పండుదబ్బచాయ బండివాడా ! బండి
నెక్కనీయవోయి యెక్కమాఱు
పున్నెముండు, తప్పిపోతి నొంటిగ నిసి
ననిన పడుచు నతడు కనికరించె. (శతపత్రము)

ఇచట 'పడుచు' పదపు తోడ్పాటువలన 'కనికరించుట' బండి యెక్కనీయుట మాత్రమేనా ? లేక సంభోగ ప్రదాన రూపమా ? యని సందేహము.



# సాహిత్యమండలి సన్మానానికి
# శ్రీ సుబ్బరామశాస్త్రి ప్రత్యుత్తరం

చిఱుత ప్రాయమునాఁడు చెడుగుళ్లు మొదలు నా
యాటల నలు చదునైన చోట
అవలఁ గొన్నాళ్లు విద్యాశిక్షణ మ్మందు
బడి లోన దండింప బడిన చోట
అవల రంగస్థల మ్మందు వేసముఁగట్టి
పలుమాఱు కొనియాడ బడిన చోట
పర పాలనమ్ము ధిక్కారణమున్ సలిపి జా
తీయతా గరిమ వర్తిలిన చోట
నేఁటి వంశ్యాని యధ్యక్ష నియతి మేటి
శతవధానమ్ముఁ బొనరించి నుతుల నంది
నాడ నాక తూఱి - యేలూరి నగరమందు
మఱియు నీ నాడు నాకు సన్మాన మొదవె.

పరమ వివేకియైన ప్రతిభా విభవుండు నృసింహశాస్త్రి మ
*ద్గురునకుఁగూర్చు మిత్త్రుడును కోవిదు డంతియె కాక యాంధ్రమున్
మెఱసెడి మేటి వెల్గు, ననుమించిన ప్రేమనుగారవించు నీ
పరిణత బుద్ధి, నే నిదె సభాపతికిన్ నతిఁజేసి నిల్చెదన్.

---

* శ్రీ చివుకుల వేంకటరమణశాస్త్రి

ఇది నా యూరని చెప్పికోదగిన యూరే యౌను, మన్మిత్రులున్
మదిలోన న్నెనరూని నాకిచట సన్మానంబునుంజేసి రౌ
ఇది నాకర్హము కాదటంచనను వాణీ! నీకునై వారలున్
మదిలో బత్తిని వెల్లడింప నది సంపాద్యమ్ముఁ గాకుండునే.

ఊరక పొంగిపోవు కవినొక్కనిఁ జూచిన యంత "కొప్పురా
వూరి" యనంగ, నీతనినిఁ బోలిన వారొక కొందరుండు రీ
తీరున ద్రవ్యసార్థకతఁ దీర్చగలట్టిరు - శారదాంబ మం
జీరము తత్తళంగనగఁ జేతము వీరికి జిల్లు జిల్లనున్.

నా గీతమ్ములఁ బాడి నా ప్రజలు వీణాతంత్రులన్ మ్రోయగా
నా గీతమ్ములతోడ నా ప్రజలు విన్నాణమ్ము నట్టాడగా
బాగా యెన్నియొ సత్కృతుల్ మదిని నిత్యమ్మున్ మహాహ్లాదులై
కాగా యిట్టివి లాంఛనమ్ము లుపదల్ కాదోటు, వాగీశ్వరీ.

పండితులున్ గవుల్ పరమభాగవతుల్ మఱి 'దామరాజు వం
శ్యుండు' పురాధినేత సరసుండునుఁ గల్గు సభాస్థలమ్ము నా
ఖండల వైభవమ్మున ధగద్ధగలాడెడి నాదు కీర్తికిన్
డిండిమమైన సత్కృతికి నేడిదె యంజలినిన్ ఘటించెదన్.

(శ్రీ కొప్పురావూరి సత్యనారాయణరావుగారి సహకారంతో ఏలూరు సాహిత్యమండలి శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రిని ది 12–6–60 న సన్మానించింది. శ్రీ నోరినరసింహశాస్త్రి గారధ్యక్షత వహించారు. మండలి కార్యదర్శి శ్రీ పుల్లాభొట్ల శ్రీరామమూర్తి స్వాగతం చెప్పారు. శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ ప్రభృతులు ప్రశంసించారు.)

# శ్రీ సుబ్బరామశాస్త్రి

| కృతులు : | కృతిపతులు : |
|---|---|
| 1. అంకితం | ....రాష్ట్రపతి, శ్రీ బాబూరాజేంద్ర ప్రసాద్ |
| 2. జాతీయ భారతి | ....ఉపరాష్ట్రపతి, శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణయ్య |
| 3. దివ్వటీలు | ....లోక్‌సభాధ్యక్షులు, శ్రీమాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగార్ |
| 4. జయభారతి | ....ఆంధ్రప్రదేశ్ శాసనసభాపతి, శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు |
| 5. విజయభారతి | ....అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షులు, శ్రీ నీలం సంజీవరెడ్డి |
| 6. మధురభారతి | ....ఆంధ్రప్రభుత్వ పూర్వామాత్యులు, శ్రీ తెన్నేటి విశ్వనాథం |
| 7. శతపత్రము | ....ఆంధ్రశాసనమండలి పూర్వసభ్యులు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ |
| 8. మధుర సంక్రాంతి | ....విజయవాడ మాజీపురపాలక సంఘాధ్యక్షులు, శ్రీ జంధ్యాల దక్షిణామూర్తి |



కవిసమ్రాట్

# శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి

## కావ్యావళి



| | | | | |
|---|---|---|---|---|
| 1 | జాతీయ భారతి<br>జయభారతి | గేయములు | 3 | 00 |
| 2 | విజయ భారతి | ,, | 2 | 00 |
| 3 | మధుర భారతి | ,, | 2 | 00 |
| 4 | మధుర సంక్రాంతి | ,, | 1 | 25 |
| 5 | నృత్యభారతి | ,, | 2 | 00 |
| 6 | బాలభారతి | ,, | 0 | 60 |
| 7 | వలిద కృష్ణమ్మ | ,, | 0 | 50 |
| 8 | ఆంధ్రభారతి | పద్యములు | 1 | 25 |
| 9 | శతపత్రము | ,, | 1 | 40 |
| 10 | అభిషేకము | ,, | 0 | 75 |
| 11 | దివ్వటీలు | ,, | 0 | 75 |
| 12 | ఉషాసుందరి | నాటకము | 1 | 50 |
| 13 | అంకితం | ,, | 1 | 50 |

ప్రతులకు :

**భారతీ నికేతన్**

*విజయవాడ-3.*